



అగ్నౌ శరీరార్పణ దివ్యగాథా:
లోకప్రసిద్ధా: బహుళాహి నార్య:
త్వయా సమానా భువినాస్తి! నాస్తి!

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూ

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి, అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి ( 1175/ విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

విచ్చెనమెల్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — లు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి - అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**
✆:31, 64, 74.

Phones : 42729. 42730. 42731 Fax : 42730, STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

nufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం   స్థాపితం : 1961   బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

Ⓒ 52262 ప్రకాశం జిల్లా   Ⓒ 87158 (S T D 08524) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయము పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కానర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణా నదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిస్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63న తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినమునను, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా, ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ   యక్కలి బాలరత్నం

అధ్యక్షులు   మరియు :   సభ్యులు   ప్రధాన కార్యదర్శి

**వైశ్య ప్రబోధిని**

(మాసపత్రిక)



**స్థాపితము**
1969



**సంపుటి**
28



**సంచిక**
5



**జనవరి - 1997**



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 25025,
24911




# పంగులూరు సీతమ్మ భూముల స్వాధీన ప్రయత్నము ధర్మ విరుద్ధము

స్వర్గీయ పంగులూరు సీతమ్మ గారు తిరుపతి నివాసి. స్వర్గీయ కుప్ప రామస్వామి శ్రేష్ఠి గారి ధర్మపత్ని. ఆమె ఉదార హృదయముతో తనకు తిరుపతి కొత్తవీధిలో గల ఇంటినీ, తిరుపతి సమీపాన కొంద్రాజు పెట్టెడలో తనకు గల సర్వే నెంబర్లు 296, 302ల లోని దాదాపు 25 ఎకరాల భూమినీ ఆర్యవైశ్యుల అభ్యున్నతికి దోహదపడు ధర్మ కార్యాలకు ఉపయోగపడునట్లుగా "టెస్టుమెంటరీట్రస్టు"గా వీలునామా వ్రాసి స్వర్గస్తులయ్యారు.

పై ఇంటిని, తిరుమల తిరుపతి యాత్రకు వచ్చు ఆర్య వైశ్యులకు ఉచితముగా మూడు రోజులు ఉండుటకు ఇవ్వాలనీ - తిరుపతిలోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయములో సంవత్సరానికి ఒక శుక్రవారమూ, శరన్నవరాత్రులలో మొదటి రోజున, శ్రీరాముల ఉత్సవాదుల్లో ఒక ఉభయాన్ని వెరశి సంవత్సరములో మూడు రోజులు ఉత్సవాలకు అయ్యే ఖర్చులకూ తాను దానంగా ఇచ్చిన భూముల్లో వచ్చే ఆదాయమును వినియోగించాలనీ, ఇంకనూ మిగిలిన ఆదాయాన్ని తిరుపతిలోని ఉన్నత పాఠశాలలో చదువు ఆర్యవైశ్య బాలురకు ఆర్థిక సహాయంగా అందించాలనీ - ఈ మొత్తము ఆస్తికి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయానికి ధర్మకర్తగా ఉండే వారే ఈ "టెస్టుమెంటరీట్రస్టు"కు ధర్మకర్తగా ఉండాలనీ - ఒక వేళ - ఈ ఆస్తులకు సంబంధించి ఏదైనా సరిక్రొత్తగా ట్రస్టు ఏర్పడితే శ్రీ వాసవీ ఆలయ ధర్మకర్త అట్లు కొత్తగా ఏర్పడిన ఆ ట్రస్టుకు ఈ ఆస్తులకు సంబంధించిన లెక్కలనూ, నిల్వ ఉన్న సొమ్మునూ యావదాస్తినీ అప్ప జెప్పచూ ఈ ఆస్తులకు ధర్మకర్తగా

ఉన్న తాను ఆ పదవిని వదలు కోవాలనీ - స్పష్టంగా ఒక వీలునామాను శ్రీమతి సీతమ్మ గారు వ్రాశారు. ఈ వీలునామాను అప్పటి తిరుపతి సబ్ రిజిస్ట్రారు 5.4.1926 నాటి సాయంత్రం 4–5 గంటల మధ్య తన ఇంటికి రాగా సీత. గారు ఆ వీలునామాను స్వయంగా ఇచ్చారు. 6.4.1926వ తేదీన 10వ వాల్యూమ్ 3వ సంపుటిలో 86 నుండి 90 పుటల్లో ఈ వీలునామాను రిజిష్టరు చేశారు.

ఇంత నిర్దుష్టముగా కేవలము ఆర్యవైశ్యుల ఉపయోగము కొఱకే ఈ ట్రస్టుకు ఇవ్వబడిన ఆ భూములను ఇప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానము వారు స్వాధీన పరచు కోవాలని భూస్వాధీన ప్రకటన చేయడము ధర్మ విరుద్ధమూ - అసమంజసమూ అనుటలో సందేహము లేదు.

వీలునామాను జాగ్రత్తగా పరిశీలించిన ఈ భూములను విక్రయించుటకు అవకాశమే లేదు. విక్రయించి, ఆ మొత్తాన్ని ఆమె ఆకాంక్షలకు వీలుగా ఖర్చు చేయాలన్నది కూడ అందులో ఏ మాత్రమూ కనిపించదు. అందుకే తిరుపతిలోని శ్రీ వాసవీ దేవ్యాలయ పూర్వపు ధర్మకర్తృత్వ మండలి ఈ భూములను కొందఱికి విక్రయించాలని నిర్ణయించి, విక్రయ దస్తావేజులను కూడ వ్రాయించి, రిజిష్టరు కూడా చేయించింది. ఆంధ్రప్రదేశ్‌లోని ఆర్యవైశ్యులెల్లరూ ఈ విక్రయాన్ని గట్టిగా ప్రతిఘటించారు. హైకోర్టులో దావా వేసి ఆ విక్రయ దస్తావేజును రద్దు పరచుట కూడ జరిగింది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు చేస్తున్న ఈ భూముల స్వాధీన ప్రయత్నాన్ని రాష్ట్రములోని వైశ్యులు తమ హృదయాలను అమితంగా బాధపరిచిన అంశముగా కూడ భావిస్తున్నారు.

5.1.1997వ తేదీన హైద్రాబాద్‌లో జరిగిన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ కార్యవర్గ సమావేశము ఈ భూముల స్వాధీన విషయముపై కూలంకషంగా చర్చించి, ధర్మ విరుద్ధము, అసమంజసమూ అయిన ఈ ప్రయత్నానికి అసమ్మతినీ, నిరసననూ తెల్పుతూ తీర్మానము చేసింది. అవసరమైతే రాష్ట్ర, జిల్లా స్థాయిలో గట్టి ప్రతిఘటనోద్యమాలను కూడ వెంటనే చేపట్టాలని నిర్ణయించింది.

ఒక దాత ధర్మ బుద్ధితో తన కులస్తులకు మాత్రమే ఉపయోగపడాలని ఇచ్చిన దాన సంబంధమైన భూములను స్వాధీనము చేసుకోడానికి భూస్వాధీన ప్రకటన ఇవ్వడము రాష్ట్రములోని వైశ్యులెల్లరలో ఆ అసంతృప్తినీ కలిగించే అంశమని, టి.టి.డి. వారు తక్షణం గుర్తించి ఆ ప్రయత్నాన్ని విరమించుకోవడం అవసరం.

వైశ్యప్రబోధిని, జనవరి 1997

# ఆత్మార్పణ దినం

కలతలతో, కల్లోల కడలిగా నున్న సర్వ ప్రపంచానికి సత్యము - అహింస - శాంతుల వల్ల కలుగు పరమ ప్రయోజనాన్ని ఆచరణలో చూపించి, 'అహింసకు మించిన ధర్మము లేదు' అను వేద వాక్యానికి ఆచరణ ద్వారా సార్థకతను కలిగించుటకై కుసుమార్యుని బిడ్డగా కలిలో అవతరించిన శ్రీ వాసవీ దేవి ఆత్మార్పణ చేసిన అత్యంత పవిత్ర దినము మాఘ శుద్ధ విదియ. ఆ తిథి ఈ సంవత్సరము (1997) ఫిబ్రవరి 9వ తేదీ ఆదివారం అవుతుంది. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాల పరిపాలకులు ఈ ఆత్మార్పణ దినోత్సవాన్ని అత్యంత ఘనంగా జరిపించాలి. కడప ప్రధాన కార్యస్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ వారి కార్యక్రమాల పత్రిక "వాసవి" ఆగస్టు - డిసెంబరు 1995లో విధానాన్ని వివరంగా ప్రచురించింది. ఆ వాసవిని చదివిన మీకు ఈ ఆత్మార్పణ దినోత్సవాన్ని జరిపించుటకు కావలసిన వివరాలు లభిస్తాయి.

ప్రతి వైశ్యుడూ 9.2.1997వ తేదీ ఆదివారం తెల్లవారు ఝాముననే తమ యింటి ముంగలిని శుభ్రపరచి రంగ వల్లులతో - రంగరంగ వైభవంగా ఇంటి ముంగలిని అలంకరించాలి. గృహ ప్రధాన ద్వారానికి మామిడి తోరణాన్ని కట్టాలి. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిని ఉద్దేశించి అయమ్మ సహస్ర నామావళితో "సర్వ ప్రజా సంక్షేమ సిద్ధ్యర్థం శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ పూజాం కరిష్యే" అను సంకల్పముతో ఆవాహనము మొదలగు షోడశ పూజలూ చేసి నైవేద్యాన్ని సమర్పించాలి.

ఈ శుభ దినాన జగన్మాత శ్రీ వాసవీ దేవిని వ్రత విధానములో అర్చించడం మరింత శుభదాయకంగా ఉంటుంది.

వ్రత విధానాన్ని తెలుసుకోవాలను కొన్న వారు రూ.27/-లు (పోస్టేజితో కలిపి) యం.ఓ. ద్వారా వైశ్య ప్రబోధినికి పంపిన అందరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో సంకలనం చేసిన "శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ వ్రతకల్పము"ను పంపగలము.

# శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి

శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి సంపాదకులు.

బ్రహ్మదేవుని నివాసము సత్యలోకము. విష్ణుదేవుని ఆవాసము వైకుంఠం. పరమేశ్వరుని వాసస్థానము కైలాసము. ఈ మూడు లోకాలకూ కొంత దూరములో ఉన్నదే మణి ద్వీపము.

ఈ మణి ద్వీపము అత్యంత శోభావహము. మహా వైభవోపేతము. ఈ ద్వీప శృంగారాన్నీ, విభవాన్నీ, పొగడుటకు వేయి నాలుకలుగల ఆదిశేషునికి కూడ సాధ్యము కాదు. సురలతోనూ, మునుల తోనూ నిత్యమూ సేవింపబడుతూ ఉంటుంది. అనంత మహిమాన్వితమైన ఈ ద్వీపము అత్యంత ఆనందదాయకము - అనంత ప్రమోదకరము.

ఈ మణిద్వీపములోనే ఆదిశక్తి అనునిత్యమూ కొలువుదీరి నిఖిల సృష్టి, స్థితి, లయాలనూ పర్యవేక్షిస్తూ ఉంటుంది. ఆ ఆదిశక్తి కరుణారసమూర్తి, కామితార్థప్రదాయని.

ఈ మణిద్వీపములో - అనంత ప్రభా భా సమానమైన సభా మందిరములో, ఆ ఆదిశక్తి -ఒకనాడు - కొలువు దీరి ఉంది. వనజాసనుడు బ్రహ్మాక్షరములతోనూ, శారదాదేవి వీణాగానానేక కళలతోనూ ఆ తల్లిని కీర్తిస్తూ ఉన్నారు. శ్రీ మన్నారాయణుడు అనేకములైన తన లీలా విలాసాల చేతనూ, మహాలక్ష్మి అత్యంత హృదయానంద కళా స్వరూపము చేతనూ, ఆ తల్లిని కొలుస్తూ ఉన్నారు. శంకరుడు తన తత్వవాక్క ధనముతోనూ, గౌరీదేవి, గంగాదేవి. మహోపచారములతోనూ -ఆ తల్లికి ప్రమోదము కలిగిస్తూ ఉన్నారు. ఆశ్రితజన విపత్పరంపరా నిర్వాపణ దుర్వహోఖర్వమై, సమస్త బృందారక, వసిష్ఠాది మహామునిగణ, యక్షసిద్ధ, ఖేచర గరుడ, గంధర్వ, ఉరగ, నరాధికభరితమై, ఆ తల్లి కొల్వు అలరారుచూ ఉంది.

ఆ ఆదిశక్తియే పరాంబ. పరాశక్తి. యోగమాయ. సర్వమునకూ ఆమెయే అధికారిణి. ఆ తల్లిని శాసించుటకు ఆమె పై అధికారము గల వారెవ్వరూ లేరు. ఆ ఆదిశక్తిని అనిరీశ్వరి, నిరీశ్వరి, కన్యక అని కూడ పిలుస్తారు. 'కన్యక' అని పిలువబడే ఆ ఆదిశక్తినే కన్యకా పరమేశ్వరిగా వైశ్యులు - అనాది నుండీ - తమ కులదేవతగా ఆరాధిస్తున్నారు.

అనేకములైన చిత్ర విచిత్ర మనోహర వర్ణనాతీత లీలా విలాసాలతో, మహాత్యముతో అలరారుచున్న ఆ పరాంబికకు గల పదునాల్గు నామాలలో 'కన్యక' అను నామము కూడ ఒకటి. ఆ కన్యక రూపము ప్రశాంతమైనది. అతి సుందరమైనది. మహా మనోహరమైనది. కరుణ, గాంభీర్యము, మాధుర్య గుణములూ గలది.

ఆనాడు -ఆ తల్లి తన - ఆ - కొలువులో, సృష్టి, స్థితి, లయాలను గురించి విచారిస్తూ ఉంది. ఇంతలో - భూదేవి - ఆజగజ్జననికి - అతి వినయముతోనూ, భక్తితోనూ - సాష్టాంగ ప్రణామము చేసి, ముకులిత

కరకములతో లేచి నిలబడింది. పరాశక్తి ఆ భూదేవి వైపు చూచింది. ఆచూపుల్లోని భావాన్ని ఆ వసుంధరాదేవి గమనించింది. "జగదీశ్వరీ! లోకమాతా!" అంటూ సంబోధించింది. "తల్లీ ఇప్పుడు భూలోకము పూర్తిగా హింసామయమై ఉంది. శాంతికి, సౌమనస్యానికి కొఱత ఏర్పడింది. దుష్టుల, దుర్మార్గుల సంఖ్య మితిమీరింది. అందువల్ల తిరిగి నాకు భారమైంది. నా నా భారాన్ని తగ్గించుటకు తిరిగి అవతారమెత్తు తల్లీ!" అని ఆ భూదేవి వేడుకొంది.

అంత - ఆ అంబ - పరాంబ - ఆ వసుంధరాదేవిని చూచి, "ఊరడిల్లుము. వసుంధరా! ఊరడిల్లుము. నీ ఆవేదనను నేను ఇంతకు *ముందే గమనించాను. అందుకు బీజావ్యాపనం కూడ చేశాను. మునుపు - ఉత్తరదిశాధిపతియైన కుబేరునికి ఒక వరం ఇచ్చాను. ఆ వరాన్ని నెరవేర్చ వలసిన సమయం ఆసన్నమైంది. ఇప్పుడు - భూ మండలమున - గోదావరీ తీరమున గల "బృహదద్రి" (పెనుగొండ)ని పరిపాలిస్తున్న కల్హారునికి ధనపతి పుత్రుడుగా* జన్మిస్తాడు. ఆయన పుట్టినపుడు, కుసుమ వర్షం (పూలవాన) కురుస్తుంది. అందువలన ఆయనకు కుసుమ గుప్తుడు అని పేరు పెట్టారు. ఆ కుసుమార్యుడు, చేసే పుత్రకామేష్టి యజ్ఞ ఫలంగా అయిన సత్రమునకే కుసుమాంబా దేవి గర్భమున నేను జన్మిస్తాను.

ఒకప్పటి నా ఆజ్ఞను పాలించగా గంధర్వులైన చిత్రకంఠుడు భూలోకమున 'పద్మశయనపురము'న జన్మించాడు. నా సంకల్పమును నెరవేర్చుటకు కారణభూతుడుగా ఉంటాడు.

ఇంతకు మునుపటి నా అవతారాలలో హింసను హింసతోనే అంతము చేశాను. ఇకముందు జరుగు నా అవతారము అందుకు పూర్తి విరుద్ధంగా ఉంటుంది. హింసకు ఇసుమంత కూడ తావులేని సరిక్రొత్త శాంతి సహిత విధానములో హింసను అంతం చేస్తాను శాంతినీ, సౌభాగ్యాన్నీ, సౌమనస్యాన్నీ - ప్రపంచములో తిరిగి స్థాపిస్తాను. వర్ణాశ్రమాచార ధర్మ సంరక్షణను చేస్తాను జగన్మనోహరమైనదిగా అప్పటి నా రూపం ఉంటుంది" అని, ఆ ఆదిశక్తి అతి మధురంగా, అలతి, అలతి నగవులతో పలికింది.

భూదేవి శాంతచిత్త అయింది. ఒక నిట్టూర్పు విడిచింది.

సాలంకాయన మహర్షి చెప్పుచున్న శ్రీకన్యకా పరమేశ్వరీ దేవి మహాత్మ్యమును విని ప్రముదిత హృదయులైన ఆ వైశ్య మహర్షులు, "మునిచంద్రమా! ఉత్తరదిశాధిపతియైన కుబేరునికి ఆ జగదీశ్వరి, పరాశక్తి ఏమని వరమును

* సమాధిఋషి కుసుమగుప్తుడుగా జన్మించాడు అనే విషయమే ఎక్కువ ప్రచారములో ఉంది. అయితే ఈ సమాధి వృత్తాంతము దేవీ భాగవతము, దేవీ మహాత్మ్యము, దేవీ సప్తశతి మొదలగు గ్రంథాలలో వేరే విధంగా ఉంది. వీటిలో సమాధి ఆముష్మిక సుఖాన్నే పరంగా అడుగుతాడు. ఇహసంబంధమైన కోర్కెలు ఆయనకు లేవు. పైగా దేవీ భాగవతం మొదలగు దేవీపరమగు పురాణాలు చాలా ప్రసిద్ధి పొందినవి. అందువల్ల సమాధే 'కుసుమగుప్తుడు' అనుటకన్నా కుబేరుడే కుసుమగుప్తుడుగా పుట్టాడని వ్రాయడమే సమంజసమని భావించడం జరిగింది.

ఇచ్చింది? ఏ సందర్భాన? ఏ కారణాన గంధర్వరాజగు చిత్రకంతుడు జగన్మాత కోపానికి పాత్రుడయ్యాడు? విశదంగా వివరించి మా వీనులకు విందు జేయండి" అని అడిగారు.

ఆ మహర్షులు అడిగిన - ఆ ప్రశ్నలు శాలంకాయనునకు అత్యంత ఆనందాన్ని కలిగించాయి. "వైశ్య మహర్షులారా! జగన్మాత కథా కుతూహలురైన మీరు పుణ్యతములు. ఆ జగజ్జనని మనస్సులో నిలుపుకొన్న మీరు సులభముగా మోక్షమును పొందగలరు. కథను వినుటలో మీకు గల ఆసక్తి, శ్రద్ధ, ఏకాగ్రత నాకు ప్రమోదాన్ని కలిగించింది. మీరడిగిన ప్రశ్నలకు సమాధానాన్ని వివరిస్తున్నాను. సావధానులై వినండి."

జగజ్జనని శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవికి సహస్రప్రణామములు చేసి, తిరిగి - కథను ప్రారంభించాడు సాలంకాయన మునిచంద్రులు.

మహర్షులారా! పార్వతీదేవిని బిడ్డగా పొందానన్న గర్వమూ; అతిశయమూ పర్వతరాజగు హిమవంతునిలో అప్పుడప్పుడూ కనిపించేది. కుబేరునికి ఆ పర్వత రాజు వైఖరి ఒక సమయమున అయిష్టతను, ఆగ్రహాన్ని కలిగించింది. జగన్మాత యైన ఆ ఆదిశక్తినే ఎందుకు బిడ్డగా పొందకూడదు? అను భావన కలిగింది. వెంటనే ఆయన ప్రశాంత వన సీమలకు వెళ్ళి ఆ ఆదిశక్తిని మనస్సులో నిలుపుకొని, తపస్సును అరంభించాడు. కొన్ని సంవత్సరాలు ఆకులు, కొన్నేండ్లు కేవల ఉదకము, ఆహారంగా తీసుకొని, తపస్సు చేశాడు. మరికొన్ని సంవత్సరాలు గాలిని మాత్రమే తీసుకొని, తపస్సు చేశాడు. ఆయన తపస్సుకు సంతసించిన ఆదిశక్తి ప్రత్యక్షమై ఎదుట నిలిచింది. వత్సా! ఏమిటి నీ కోరిక? అని అడిగింది. కుబేరుడు కన్నులు తెరిచాడు. ఎదుట జగన్మాత. మందస్మిత సుందర వదనార వింద. కుబేరుడు లేచి ఆ తల్లికి సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆ జగదీశ్వరిని ఎన్నో విధాలుగా స్తుతించాడు. తల్లీ! జగన్మాతా! నీవు నా బిడ్డగా పుట్టి నన్ను ఆ హిమవంతుని కన్నా ఉన్నతునిగా ఒనర్చు. అని భక్తితో, ఆ తల్లికి విన్నవించు కొన్నాడు.

ఆశ్రితుల పాలిటి కల్పవృక్షమైన ఆ తల్లి కనికరించింది. అట్లే జన్మిస్తానని పలికింది. అయితే "కుబేరా! ఈ నీ కోరిక ఈ జన్మలో తీరదు. నా సంకల్ప ఫలితంగా కలియుగమున నీవు జన్మిస్తావు. అప్పుడు నేను నీకు బిడ్డగా పుట్టాను. అప్పటి నా అవతార ధ్యేయ సాధనకు నీవు ఆలంబన మవుతావు. ఈ విధంగా నీ కోరిక తీరుతుంది" - అని అనతి ఇచ్చింది ఆ పరాంబ.

జగదంబ పలికిన పలుకులు విని అనంత ఆనందాన్ని పొందిన ఆ ధనపతి ఆ జగజ్జననికి సహస్రాధిక వందనము లర్పించాడు. అమ్మా! కృపామయీ! నా కోర్కెను మన్నించి, నన్ను కరుణించినందుకు నా కెంతో సంతోషం కలిగింది. కానీ, నా కుమార్తెగా జన్మించే అప్పటి నీ రూపము ఒకసారి తనివితీరా తిలకించాలని మనస్సు ఉవ్విల్లూరుచున్నది. దివ్య మంగళమైన అప్పటి ఆ రూపముతో ఒకసారి నా కనులకు విందుజేసి నా యీ జన్మను చరితార్థము

కావించు తల్లీ! అని తిరిగి ప్రార్థించాడు ఆ ఉదీచ్యదిశాధిపతి.

వెంటనే ఆ యమ్మ పదునైదు వర్షాల ప్రాయము - చిఱునగవులు చిందే సుందర వదనము - సర్వాభరణములు - బంగరు గజ్జెల పాదాలు - నేలపై జీరాడు కుచ్చుల చెఱగుల పావడా - లతో సాక్షాత్కరించింది. ఆ మనోమోహనమైన ఆ రూపాన్ని తిలకించి, ఆ ధనాధిపతి 'ధన్యోస్మి' అనుకున్నాడు.

అదే సమయములో - అదే మార్గాన - ఆకాశయానము చేస్తున్న గంధర్వ రాజగు చిత్రకంతునకు ఆ ఆదిశక్తి యొక్క పదునైదేండ్ల ప్రాయము గల ఆ ఆకార వైభవము కనిపించింది. పురాకృత కర్మఫలాధిక్యత ఫలితంగానూ, ఆ జగన్మాత సంకల్ప ప్రభావం వల్లనూ అతనిలో ఆ రూప సౌందర్యము - కామభావనను కలిగించింది. ఆ తరువాత ఆ తల్లిని మోహదృష్టితో చూశాడు. అది గమనించిన ఆ జగజ్జనని "దుర్మార్గుడా! కామ మోహితుడవై, స్వస్థితిని విస్మరించి, విచక్షణను కోల్పోయి, నీకే కాదు, సర్వసృష్టికే తల్లినైన నన్ను కామ దృష్టితో చూచిన నీకు నిష్కృతి సులభంగా లభించదు. భూలోకమున బుట్టి ఈ పాప ఫలమును అనుభవించు" అని ఆయమ్మ అతనికి శాపాన్ని ఇచ్చింది.

తన దుష్కృతమునకు చింతించి కన్నుల కప్పిన కామము వీడగా, ఆ తల్లి పాదాలపై పడి, "పరమేశ్వరీ! నా తప్పును మన్నించు. ఏదో కాల ప్రభావమున నాలో కలిగిన దుష్టభావ ఫలితమే. కానీ వేరు కాదు. కారుణ్యమూర్తివైన ఓ తల్లీ! నన్ను క్షమించు. నా తప్పును మన్నించు. నిష్కృతి మార్గమును ప్రసాదించు" అని ఆ గంధర్వరాజా తల్లిని ప్రార్థించాడు.

ఓ గంధర్వరాజా! నిజస్థితిని గమనించి, తప్పును తెలుసుకొన్న నీకు శుభమగును. అయినా నా యీ ఆగ్రహ ఫలితాన్ని అనుభవించక తప్పదు. కలియుగమున నీవు చంద్రవంశ రాజుగా జన్మిస్తావు. ఈనాటి నా యీ మనోహర రూపము లీలా మాత్రముగా గోచరించి, ఆ ధ్యాసతోనే ఉండి కుమిలి, కుమిలి చివరకు నా అవతార సమాప్తి ఉదంతము చెవుల బడినంతనే, మరణిస్తావు. అప్పటి - ఆ నా అవతార ధ్యేయానికి ఒక సాధనముగా ఉండిన కారణంగా మరణానంతరము తిరిగి గంధర్వరాజువై పుట్టి నన్ను సేవించి తుదకు నాలో ఐక్యమౌతావు." అని అతనికి నిష్కృతిని తెల్పింది పరాంబ.

క్రీస్తుకు పూర్వము 2617 * సంవత్సరములనాడు, ఈనాటి ఉభయ గోదావరి జిల్లాలకు చెందిన ప్రాంతములో 'బృహదద్రి' అను పేరుగల ఒక పట్టణముండినది. ఆ పట్టణమునకు దగ్గరగా గోదావరీ నది ప్రవహించు చుండినది. ఆ గోదావరిలోని నీరు మంచి రుచి గలవి. ఆ నీటిని త్రావి సత్తువ లేకనే అచ్చటి భూములు సమృద్ధిగా పంటలను ఇస్తాయి. ఆ పట్టణమును అనుకొని మరి పదునెన్మిది పట్టణాలు కూడ ఉండినవి.

---

* జ్యోతిష విద్వాంసులు శ్రీ చేబ్రోలు రోశయ్య గుప్త గారి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ లఘు పురాణం పుట 23 - పై గ్రంథము ప్రతి వైశ్యుడూ తన ఇంట్లో తప్పనిసరిగా ఉంచుకోవలసినది.

బృహదద్రి ఈ పట్టణాలకు రాజధాని. కుసుమగుప్తుడు అను వైశ్య ప్రభువు ఈ బృహదద్రిని రాజధానిగా చేసుకొని ధర్మమును నాలుగు చరణములతో నడిపిస్తూ, ప్రజలను కన్నబిడ్డల వలె చూచుకొంటూ పాలిస్తున్నాడు. ఈయనది ప్రాభాతస గోత్రము. ఈయనచే నియమితులైన పదునెన్మిది మంది నగరస్వాములూ మిగిలిన పదునెన్మిది పట్టణాలను పాలిస్తూ కుసుమార్య ప్రభువును భక్తితో కొల్చుచూ ఉన్నారు. కుసుమాంబ ఈయన భార్య. ఆమె సాధ్వీశిరోమణి. పతి మాటలను జవదాటని గుణవతి.

కల్యాణమై, బహుకాలమైనా వారికి సంతాన ప్రాప్తి కలుగలేదు. యశస్సులోనూ - ధనములోనూ - భోగములోనూ ఏ కొఱతా లేకున్నా సంతానము లేని కొఱత ఆ ఆదర్శ దంపతులకు విచారాన్ని కలిగించింది. వ్రతాలు - తపాలు - నిరతాన్నదానాలు చేశారు. అయినా వారి కోరిక తీరలేదు. సంతానం కలుగలేదు. ఒక మునీశ్వరుడు చెప్పిన మాటలు విని వారు పుత్రకామేష్టి యాగాన్ని చేశారు. ఆ యాగ ఫలంగా అచిర కాలములో, కుసుమాంబాసతి గర్భం ధరించింది. తొమ్మిది నెలలు గడిచాయి. వైశాఖ శుద్ధ దశమి - శుక్రవారము - పునర్వసూ నక్షత్రమున శుభగ్రహాలు ఉచ్ఛ స్థితిలో ఉన్న సమయములో - కుసుమాంబ ప్రసవించింది. మొదట ఒక బాలిక - ఆ తరువాత ఒక బాలుడు జన్మించారు. పదకొండవ రోజున బాలికకు 'వాసవి' అనీ, బాలునికి విరూపాక్షుడు అనీ ఆ రాజ దంపతులు నామకరణం చేశారు.

ఆ బాలిక జనన కాల గ్రహ సంపత్తిని పరిశీలించిన కార్తాంతికులు అనగా జ్యోతిష్కులు "ఈమె గొప్ప జాతకురాలు - ఈమె ఈ జన్మవల్ల ఒక మహోపకారము ఈ జగత్తుకు కలుగుతుంది. తల్లిదండ్రులకు ఉత్తమ లోకాలు కలిగిస్తుంది. వారి పవిత్ర నామాలను భావితరాలు కూడ చెప్పుకొనేటట్లు చేస్తుంది. విరూపాక్షుడు మహావీరుడు అవుతాడు. తండ్రి అనంతరము ఈ రాజ్యాన్ని ధర్మ మార్గములో పాలించి, తండ్రి సంపాదించిన కీర్తిని రెండింతలు చేస్తాడు" అని చెప్పారు.

కుసుమార్యుడు ఆ ఇద్దరికీ విద్యా బుద్ధులను నేర్పించాడు. వారు సర్వశాస్త్ర కోవిదు లయ్యారు. వారిలో 'వాసవి' ఏక సంధాగ్రహి. అనగా ఒకసారి గురువు చెప్పినంతనే ఆ సర్వ విషయాన్నీ అవగాహన చేసుకోగలది. విరూపాక్షుడు రాజోచిత విద్యలన్నింటిలో అఖండ ప్రతిభను - ప్రావీణ్యాన్నీ సంపాదించాడు.

వాసవి హృదయం చాలా సున్నితమైంది. కరుణారస పూరితమైంది. పరుల దు:ఖాన్నీ విచారాన్నీ చూచి సహించలేనిది. వయస్సు వచ్చే కొద్దీ వాసవిలో పారమార్థిక చింతన కలిగింది. కలగడమే కాదు. వయస్సుతో బాటు ఆ చింతనా పెరుగుచూ ఉంది. లౌకిక విషయాలపై ఆమె మనస్సు పోలేదు. ఏదో ఒక రకమైన అంతర్మథనం ఆమెలో కొనసాగుచూ ఉంది. గ్రుడ్డి, మూగ, అవిటి వారలనూ, వృద్ధులనూ చూచినపుడు ఆమె మనస్సు ఆవేదన పడేది. హింసాత్మక విషయాలను విన్నా,

హింసాత్మక సంఘటనలను కన్నా - ఆమె హృదయం అమితంగా క్షోభించేది. మానవుని లోని స్వార్థ చింతన, తన సుఖం అకు పరులను బాధించే పద్ధతి ఆమెను కలత పరచింది. ఇవన్నీ కలిసి ఆమెను మరింత ఆలోచనా పరురాలుగా చేశాయి. కులగురువు భాస్కరాచార్యులు వాసవిలో కలుగు మార్పునూ, ముఖ కవలికలనూ, ఆలోచనలనూ గమనిస్తున్నాడు. జగజ్జనని శ్రీ కన్యకా పరమేశ్వరి ముందు ఆయమ గంటల తరబడి ధ్యానములో కూర్చునేది.

క రోజు, ప్రభాతసమయాన, ఆలయానికి అరుదెంచిన గురువు భాస్కరాచార్యులకు ధ్యాన ముద్రలో ఉన్న వాసవి కనిపించింది. ఆమె ముఖాన్ని పరీక్షగా చూశాడు. ఆమె నుదుట జగజ్జనని ఆదిశక్తి, శ్రీ కన్యకా పరమేశ్వరీ రూపము సాంగముగా, ప్రసన్న వదనంతో కన్పించింది. ఆ దివ్య రూపాన్ని తిలకించిన ఆయన ధన్యతను చెందినట్లుగా భావించాడు. ఈ వాసవి కారణజన్మురాలు. శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవియే ఈమెగా అవతరించింది. ఈమె జన్మవల్ల ఈ లోకానికి ఒక గొప్ప ఉపకారము జరుగుతుంది అను భావన కలుగగా శ్రీ వాసవి జనన సమయమున కార్తాంతికులు చెప్పిన విషయం ఆయనకు గుర్తుకు వచ్చింది. రెండు చేతులను ఎత్తి ఆమెకు నమస్కరించాడు.

"గురువర్యా! ఎందుకు ఈ లోకములో జీవులు జనన మరణ, సుఖ దుఃఖాలను పొందుచూ ఉన్నారు. ఎందుకు అంగవిహీనులు అగుచున్నారు. మానవులెందుకు హింసా వైఖరిని అవలంభించి ఎదుటి వారిని బాధ పెట్టుతున్నారు' - అని వాసవి భాస్కరాచార్యులను ప్రశ్నించేది. ఆ మాటలు విన్న ఆయనలో ఆశ్చర్యం కలిగేది. వయస్సుకు మించిన ఆ బాలిక ప్రశ్నలు ఆయన్ను ఆశ్చర్య పరచాయి. వాసవి ఆలోచనలు ఎప్పుడూ ప్రాపంచిక విషయాలను గురించినవి కావు. ఆమె ఆలోచనలూ, గురువును అడిగే ప్రశ్నలూ అన్నీ కూడ విశ్వ శ్రేయస్సుకు సంబంధించినవే. లోకములో సుస్థిర శాంతి - సౌఖ్యాల స్థాపనకు చెందినవే.

భాస్కరాచార్యులు అడిగిన ప్రశ్నలకు వాసవి ఇలా జవాబు కూడ చెప్పేది. "గురువర్యా! ఈ లోకములో శోకము లేకుండా చెయ్యాలి. మనిషిలో మంచినీ, మమతనూ, మానవతనూ అనంతంగా కలిగించాలి. హింసను హింసతో కాక అహింసతో రూపుమాపాలి. ఇందు గురించే నా ఆలోచన - నా ప్రయత్నము. ఈ ప్రయత్నములో అచిర కాలములోనే విజయాన్ని సాధిస్తాను" అను నమ్మిక కూడ నాకుంది.

కుసుమార్యుడు బృహదద్రిని పాలిస్తున్న సమయములోనే విష్ణువర్ధనుడు అను రాజు పద్మశయన పురమును రాజధానిగా చేసుకొని తీర ప్రాంతాన్ని పాలిస్తున్నాడు. ఆయనకు ఒకనాటి - ప్రత్యూష కాలమున - ఇంకా - నిద్రలేవకనే - ఒక మధుర స్వరము వినిపించింది. ఆ స్వరమును విని మేలు కొన్న ఆ రాజుకు ఒక సౌందర్యవతి రూపము లీలగా కనిపించి - ఆయన చూస్తుండగానే నడచి దూరంగా వెళ్ళిపోయింది. అప్పటి నుండీ, ఆయన కా మధుర స్వరము వినిపిస్తూనే ఉంది.

ఆ స్త్రీల సౌందర్య స్వరూపము కనిపిస్తూనే ఉంది. అవి ఆయన్ను కడకు ఉన్మత్తుని చేశాయి. ఆయన మనస్సులో ఆందోళనను లేపాయి. ఆ ఆందోళనను మరచుట కాయన మధువునూ - మానినులనూ ఆశ్రయించాడు. రాణినీ, రాజ్యాన్నీ విస్మరించాడు.'

ఆ విపత్తు నుండీ రాజును రక్షించుటకు ఆయన కులగురువు రాణితో ఒక వ్రతం చేయించాడు. రాణి చేసిన ప్రయత్నం ఫలించి, ఆ వ్రత సందర్భనకు విష్ణువర్ధనుడు అరుదెంచాడు. అప్పుడు, మంత్రి దండనాథాదులు రాజ్య విషయాలనూ, పరరాజుల ఎత్తులనూ ఆయనకు వివరించారు.

ఆయన అనుమతిని ఆ సంవత్సరం శరన్నవరాత్రోత్సవాలను యథావిధిగా జరిపించారు. అశ్వినీ నక్షత్రయుక్తమైన, ఆశ్వయుజ. విజయ దశమీ శుభ ముహూర్తాన కుమారుడు రాజ రాజేంద్రుని యువరాజుగా పట్టాభిషిక్తున్ని చేశారు.

మనస్సును కలత పఱచే విషయాలు కొంత తగ్గగా ప్రశాంతత చిక్కిన విష్ణువర్ధనుడు శ్రీశైల క్షేత్రమునకు వెళ్ళి అచ్చటి శ్రీ మల్లికార్జునస్వామి, భ్రమరాంబాదేవులను సందర్శించి, తిరుగు ప్రయాణమును పాలకొల్లు మీదుగా చేస్తూ, బృహదద్రిని చూచి, ఆ పుర సౌందర్యాన్ని తిలకించి, ముగ్ధుడై ఆ రాత్రికి ఆ ఉద్యాన వనాలలో విడిది చేసి, తమ విడిదికి అనుమతిని అర్థిస్తూ, కుసుమార్యుని వద్దకు భటులను పంపాడు. కల్ల - కపటము - దుష్టపుటాలోచన లేని కుసుమార్యుడు అందుకు అనుమతిని ఇవ్వడమే గాక, మరుదినము తన పురములోనికి సకల రాజ మర్యాదలతో ఆహ్వానించి, శ్రీ కన్యకా పరమేశ్వరీదేవి దర్శనాన్ని చేయించారు. తమ హోదాకు తగ్గట్టుగా అతిథి సత్కారాలను జరిపించాడు.

నగర సందర్శనానంతరము పద్మశయన పురమునకు బయలు దేరుటకు సిద్ధపడుచున్న విష్ణువర్ధనునికి ఒక మధుర స్వరం వినిపించింది. ఏ స్వరమైతే తనకు నిరంతరంగా వినిపిస్తూ మనస్సును ఆందోళన పరచేదో ఆ స్వరమే అది.

భటులను పంపి, ఆ మధుర స్వరం వస్తున్న వైనాన్ని తెలుసుకొని, ఆ స్వర మాధుర్యము వాసవి గీతాలాపన ఫలితమనీ, ఆ వాసవి కుసుమార్యుని తనయ అనీ తెలుసుకొన్నాడు. తన ప్రధానిని కుసుమగుప్తుని వద్దకు పంపి, 'వాసవి' ని తన అర్ధాంగిగా చేయమన్నాడు. కుసుమార్యుడు అంగీకరించలేదు. ఆగ్రహం చెందిన ఆ నరపతి ప్రధాని హిత వచనాలతో శాంతపడి తన నగరమునకు బయలుదేరి వెళ్ళాడు.

సంధి ప్రయత్నాలు జరిగాయి. విష్ణువర్ధనుడు తన మూర్ఖపు పట్టును వీడలేదు. బృహదద్రిపై దండెత్తాలనీ, వాసవిని బలవంతంగా తీసుక పోవాలనీ ప్రయత్నిస్తున్నాడు. చారులు ఆ వార్తలు కుసుమార్యునికి అందించారు. వీరుడైన విరూపాక్షుని నాయకత్వానగల బాలనగరులు, ఆ మాటలకు ఆగ్రహించి, విష్ణువర్ధనునిపై దండెత్తి వెళ్ళుటకు నిర్ణయించారు: ఆ వార్తను విన్న మిగిలిన పదునెన్మిది పట్టణాల స్వాములు కూడ

విష్ణువర్ధనుని మద మడచాలనే నిర్ణయించారు. కుసుమార్యుడు యుద్ధము వలన, రక్తము చిందుతుందనీ అమాయకులైన ప్రజలు మరణిస్తారనీ రాజ్యములో శాంతి క్షీణిస్తుందనీ ప్రజల జీవనం బాధాకరమగుతుందనీ ఆలోచిస్తున్నాడు.

ఆ వార్త వాసవి చెవిన పడింది. ఆమె ఆలోచనా మందిరానికి అరుదెంచి, ఇందుకు యుద్ధము సమాధానం కాదనీ, హింసను హింసతో కాక, అహింసతో జయించాలి అన్నదే తన ధ్యేయమనీ స్పష్ట పరచింది. బాలనగరుల - ఆగ్రహానికీ, ఆవేశానికీ ఆమె అడ్డు వేసింది. "ఈ సమస్య నా వల్ల ఉత్పన్నమైంది కాబట్టి నా వల్లనే ఈ సమస్య పరిష్కారం కూడ అవుతుంది - అందుకు వీలుగా నేనే అగ్ని ద్వారా ఆత్మాహుతి చేసు కొంటాను" అని చెప్పింది. కుసుమార్య దంపతుల దు:ఖము కానీ, విరూపాక్షుల శౌర్య ప్రతాపాలు కానీ ఆమె ఆ నిర్ణయాన్ని మార్చలేక పోయాయి. తుదకు ఆమెతో బాటు కుసుమార్య ప్రభువు, కుసుమాంబ, నూట రెండు గోత్రాల వారూ ఆత్మార్పణ చేయాలని నిర్ణయించారు. మొదట అందరూ అంగీకరించకున్నా చివరకు అంగీక రించారు. ఆత్మార్పణను జరుపుటకు తిథి కూడ నిర్ణయమైంది.

ప్రభవనామ సంవత్సర మాఘ శుద్ధ విదియ 11.2.2628 * నాటి ఉదయం వాసవి ఆత్మార్పణ చేయుటకు అగ్నిలో ప్రవేశించింది. ఆమెను దహించుటకు అగ్నిభట్టారకుడు భయపడి పోయాడు. హవ్యవాహనా! ఇది నా అవతార ధ్యేయము. నన్ను దహించుటవల్ల నీకు ఎటువంటి ప్రమాదం జరగదు. నన్నే కాదు నాతోబాటు అగ్ని కుండముఖలో ప్రవేశించనున్న ఈ నూట రెండు గోత్రాలకు చెందిన దంపతుల దేహాలనూ దహించు అని వాసవి అగ్ని భట్టారకుని ఆదేశించింది. ఆ తరువాత, శ్రీ కన్యకా పరమేశ్వరిగా కాక, శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరిగా పూజింపమని ఆ సందర్భములో ఆ తల్లి అజ్ఞ ఇచ్చింది. అందుకే ఇప్పుడు శ్రీ కన్యకా పరమేశ్వరి దేవిగా కాక వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవిగా ఆర్యవైశ్యులు పూజించి తరించాలి.

చారుల ద్వారా వాసవి ఆత్మార్పణ విషయాన్ని విన్న విష్ణువర్ధనుడు తల పగిలి మరణించాడు.

ఈ విధంగా రక్తరహిత శాంతి సత్యాగ్రహము అను పవిత్రమైన ఆయుధాన్ని ఈ జగత్తుకు ప్రసాదించుట ద్వారా వాసవి ఈ ప్రపంచములో ప్రథమ సత్యాగ్రహి అయింది. ఈ విధంగా అంధకార బంధురమైన ఈ జగత్తులో ఆ జగజ్జనని అహింసా దీపాన్ని వెలిగించింది. వర్ణాశ్రమాచార ధర్మ సంరక్షణను చేసింది. అత్యంత పవిత్రమూ, అనంత శుభప్రదమూ అయిన వాసవీ జన్మ వృత్తాంతాన్ని సావధానులై విన్న వారికి సర్వ శుభములూ, సకల సౌభాగ్యాలూ కలుగుతాయి. ముక్తి కూడ కలుగుతుంది.

**శ్రీ వాసవీ ఆత్మార్పణ దినోత్సవ సందర్భంగా**

* శ్రీ వాసవీ కన్యకా లఘు పురాణం - పుట 23.

# గున్నయ్య శ్రేష్ఠి, బొగ్గవరపు సుబ్బరావు గారలకు వాసవీ పొట్టి శ్రీరాములు అవార్డులు

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘముల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభల మాజీ అధ్యక్షులు మచిలీపట్టణం పురప్రముఖులూ, ప్రతిభావంతులూ, శ్రీ జి.వి.గున్నయ్య శ్రేష్ఠి,



**వాసవీ పొట్టిశ్రీరాముల అవార్డును అందుకొన్న శ్రీ గున్నయ్య శ్రేష్ఠి గారు**

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ కార్యదర్శులూ, పారిశ్రామిక వేత్తలూ, గుంటూరు పుర ప్రముఖులూ, సౌజన్య శీలురూ అయిన శ్రీ బొగ్గవరపు సుబ్బరావు,

గారలు హైద్రాబాద్ పట్టణం ప్రధాన కార్య స్థానంగా గల శ్రీ వాసవీ ఆర్ట్ థియేటర్స్ వారు ఇస్తున్న "వాసవీ పొట్టి శ్రీరాముల" అవార్డులను 29.12.1996వ తేదీన హైద్రాబాద్‌లోని సుందరయ్య కళా భవనములో జరిగిన అవార్డులను ఇచ్చు కార్యక్రమములో స్వీకరించారు. కవిరత్న శ్రీ చింతల శ్రీనివాస్ గారి అధ్యక్షతన



**వాసవీ పొట్టిశ్రీరాముల అవార్డును అందుకొంటున్న శ్రీ బొగ్గవరపు సుబ్బరావు గారు**

జరిగిన ఈ సభలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటి ప్రెసిడెంటూ, మాజీ మంత్రి వర్యులూ, శ్రీ కె.రోశయ్య గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

## 'బాలరత్న' అవార్డు చిరంజీవి ముడియం శ్రీ చందన్‌కు



'బాలరత్న' అవార్డును అందుకొన్న చి॥ చందన్

పై సంస్థ వారు ఇస్తున్న 'బాలరత్న' అవార్డును ఈ సంవత్సరం చిరంజీవి ముడియం శ్రీ చందన్ అందుకొన్నారు. చిరంజీవి 'చందన్' కడప లోని లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ డివిజనల్ ఆఫీసులో ఉద్యోగిగా ఉన్న శ్రీ ముడియం కిశోర్ గారి పుత్రులు. "మాస్టర్ ఆఫ్ ది డిస్ట్రిక్టు", "లిటిల్ టాలెంట్" అను అవార్డులను కూడ ఈ చిరంజీవి ఇంతకుముందే అందుకొన్నారు. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి.నారాయణ రెడ్డి, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ పడుచూరు వెంకటేశ్వర్లు గారలు ఈ కార్యక్రమంలో అవార్డుల ప్రదాతలుగా వ్యవహరించారు.

## గుంటూరులో అమరజీవి వర్ధంతి

అమరజీవి పొట్టి శ్రీరాములు గారి 44 వర్ధంతి గుంటూరులో 15.12.96న ఘనంగా జరిగింది. గుంటూరు పట్టణ ఆర్యవైశ్య సంఘము, వైశ్య యువజన సంఘములు సంయుక్తంగా నిర్వహించిన ఈ కార్యక్రమ సందర్భంగా శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయ ప్రాంగణములో గొప్ప సభ జరిగింది. సభకు శ్రీ వనమా పూర్ణ చంద్ర రావు గారు అధ్యక్షత వహించారు. నగర మేయరు డా॥ కొల్లి శారద గారు ఈ సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. భారత వాణిజ్య మండలి అధ్యక్షులు శ్రీ అతుకూరి ఆంజనేయులు, నగర భారతీయ జనతా పార్టీ అధ్యక్షులు శ్రీ జూపూడి రంగ రాజు, శ్రీయుతులు చిర్రావూరు సాంబశివ రావు, దాసరి నాగశివ, కొమ్మూరి జగన్మోహన రావు ప్రభృతులు ప్రసంగించిన ఈ సభకు పట్టణ ఆర్యవైశ్య సంఘం సంచాలకులు శ్రీ .గుడివాడ వెంకటేశ్వర రావు గారు స్వాగతం పలుకగా ఆర్యవైశ్య యువజన సంఘం అధ్యక్షులు శ్రీ కొత్తూరి వెంకట్ గారు వందన సమర్పణ చేశారు.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 జనవరి 21 నుండీ 1997 ఫిబ్రవరి 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 26 | 2 | 9 | 16 |
| సోమవారము | | 27 | 3 | 10 | 17 |
| మంగళవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| బుధవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| గురువారము | 23 | 30 | 6 | 13 | 20 |
| శుక్రవారము | 24 | 31 | 7 | 14 | |
| శనివారము | 25 | ఫిబ్రవరి 1 | 8 | 15 | |

జనవరి 23 :- శ్రవణ కార్తె.

జనవరి 26 :- సంపూర్ణ స్వాతంత్ర్య దినము (రిపబ్లిక్ డే) - జాతీయ సెలవు దినము - దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

జనవరి 30 :- గాంధీ నిర్యాణ దినము - మృత వీరుల సంస్మరణ దినము.

జనవరి 31 :- పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 డిసెంబరులో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ జనవరి 31వ తేదీలోగా చేర్చాలి.

జనవరి 31 :- 1996 డిసెంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

ఫిబ్రవరి 5 :- గురు మౌఢ్య నివృత్తి - ధనిష్ఠ కార్తె రాక - తె. 5-41.

ఫిబ్రవరి 9 :- శ్రీ వాసవీ జయంతి - మాఘ స్నానారంభం.

ఫిబ్రవరి 10 :- రంజాన్ పండుగ - దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

ఫిబ్రవరి 14 :- రథ సప్తమి.

ఫిబ్రవరి 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

ఫిబ్రవరి 19 :- శతభిష కార్తె రాక - ఉ. 9-27.

ఫిబ్రవరి 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**26, 2, 9, 16 ఆదివారాలు**

---

*నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్)


టెలిగ్రాం అన్ని చోట్ల "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"

టెలిఫోన్ నెం. : మార్కాపురం : 22740, 22004

శ్రీశైలం : 87140, 87114

పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682


## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. <u>వాసవీ సత్రం, శ్రీశైలం</u> :– 150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

   30×10 రూము రూ.30,000/-, 15×9 రూముకు రూ.25,000/- అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. <u>వాసవీ నివాస్, పుట్టపర్తి</u> : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,00,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించ బడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు). సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూమ్సు డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు యివ్వబడును 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారికి వంశపారపర్యంతం సభ్యత్వం ఉండును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన పర్వ దినం రోజునను, రు.6116-00 సమర్పించిన పర్వ దినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణమునకు 4.10.95 ఉదయం గం॥ల 9-21 ని॥లకు శంఖుస్థాపన, అదే రోజు ఉదయం గం॥ల 9-47 ని॥లకు నిత్యాన్న సత్రంనకు అగ్నిప్రతిష్ఠాపన జరిగినది. భోజనహాలు నిర్మాణం చేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

<u>నిత్య అన్నసత్రమునకు గాను</u> రు.2501/-లు సమర్పించిన యెడల వంశపారంపర్యంతం సభ్యత్వము, పర్వదినం రోజున అన్న సంతర్పణ ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుప బడును. పై యిద్దరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. రు. 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో, ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల

నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCET లో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ క్రతువు 16.11.95 నుండి 24.11.95 వరకు పుట్టపర్తిలో జరిపించినాము. 1996వ సంవత్సరములో క్రతువు ఎక్కడ జరుపునదీ జరుగబోవు కార్యవర్గ సమావేశములో నిర్ణయిస్తాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—


మూర్తి వెంకటేశ్వర్లు,

వాసవీ సత్ర సముదాయం, కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.


**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.






# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**DESIGNED WITH MARBLE FLOORING, TEAK WOOD DOORS, WINDOWS WITH MOSQUITO PROOF MESH SHUTTERS, TOILET FACILITIES BOTH INDIAN & WESTERN STYLE, AIR-CONDITIONED SUITES WITH THE FOLLOWING**

*REGISTERED OFFICE :*

6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.
Phones : Off : 394320, Res : 313796. (STD : 040) Fax : 394320.

*GUEST HOUSE :*

SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.
Anantapur Dist. (A.P.) India. ✆ : 08555-87507, 87508 Fax : 08555-87508.

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every Suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. A Pure Vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
5. STD, ISTD, FAX Facilities.
6. A Doctor on call.
7. Safety Lockers.
8. Ample Parking space.
9. Prompt Service and best facilities at affordable Tariff.

# స్తుతిగీతం

శ్రీమతి శఖికొల్లు లక్ష్మి మోహన్ - హైదరాబాద్

అంబా వాసవీ దేవీ.... వైశ్యకుల పరమేశ్వరీ....

వైశ్యులకు స్ఫూర్తి నిచ్చు దేవీ

సత్యం, ధర్మంకోసం ఆత్మాహుతు చేసుకొని

వైశ్య కుల దీప్తివి నీవై

సౌశీల్యతకు రూపము నీవై

స్త్రీ జాతికి రత్న మునీవై

వెలుగొందే దేవీ పెనుగొండ నివాసినీ శ్రీ కన్యకా పరమేశ్వరీ! నీకృపా కటాక్షములే ఎల్లవేళలా వైశ్యజాతిని రక్షించు! నీ అండ వారికుండే నీ ప్రియ పుత్రులు జాతి రత్నములుగా వెలుగొందుచున్నారు.

అదిగదిగో నీవు ప్రబోధించిన అహింసా మానవతాది ధర్మములను పాటించి జాతిపితగా నిలిచిన మహనీయ గుణాఢ్యుడు శ్రీ గాంధీ మహాత్ముడు నీ ప్రియ పుత్రుడే కదా.

ఆంధ్ర రాష్ట్రావ తరణమునకై విరుపమాన, అనమాన తేజోమయుడు, కార్య దీక్షాపరుడు నిరాహార దీక్షా కంకణం కట్టి అసువులు బాసిన అమరజీవి పొట్టి శ్రీరాములు నీ ప్రియ పుత్రుడే కదా.

సింహపురి సింహముగా వాసికెక్కి ఆంగ్లేయుల గుండెలను గడగడ లాడించిన గదర్ నాయకుడు, అసమాన వీరుడు, మానవతావాది దర్శి చెంచయ్య నీ ప్రియ పుత్రుడే కదా.

పండితుల, పామరుల మనుసులను తన గీతా మకరందము చేత, రంజింపచేసి ఆధ్యాత్మిక ప్రబోధములతో జ్ఞాన నేత్రములను తెరిపించు శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందులు నీ ప్రియపుత్రుడే కదా.

పరమహంస పరివ్రాజకా చార్య పలాపేక్ష రహితుడు మణిపూసవలె నిరంతరము ప్రకాశించి శబ్దార్థ కల్పతరువును రచించి భారత దేశానికి విజ్ఞాన భిక్షను పెట్టిన శ్రీశ్రీశ్రీ శుద్ధ చైతన్య స్వామి నీ ప్రియ పుత్రుడే కదా.

శ్రీ తిరుపతి వెంకట కవుల ప్రియ శిష్యుడు వైశ్యకవి శిరోమణిగా నాటికీ నేటికీ ఆర్యవైశ్య రత్నం శ్రీ దోమా వెంకట స్వామి గుప్త నీ ప్రియ పుత్రుడే కదా.

సంస్కృతాంధ్ర, ఆంగ్ల, జర్మన్ భాషా ప్రవీణుడు, చతుర్వేద షట్శాస్త్ర పారాయణుడూ, వేదోక్త, ధర్మ ప్రచారకుడు శ్రీశ్రీశ్రీ ఆత్మూరి లక్ష్మి నృసింహ సోమయాజులు నీ పుత్రుడే కదా.

కవియై, గాయకుడై, సంస్కారియై, భాషాసేవకుడై, కళాతపస్వియై వాసికెక్కి జగత్ప్రసిద్ధి చెందిన గౌతమీ గ్రంథాలయం వ్యవస్థాపకుడుగా చరిత్రలో నిలిచిపోయిన మాన్యులు శ్రీ నాళం కృష్ణారావు నీ ప్రియ పుత్రుడే కదా.

ప్రప్రథముగా ప్రపంచములో మొదటి విమానాన్ని నిర్మించి చరిత్ర పుటల్లో నిలిచిపోయిన మేధావంతుడు యస్. వి. శెట్టిగారు నీ ప్రియ పుత్రుడే కదా.

(ఇప్పటికీ మైసూర్ మహరాజ్ ప్యాలెస్‌లో వారు చేసిన చిన్న మోడల్ విమానం అలాగే వుంది)

ఆంధ్ర నిఘంటువులో శబ్దార్థములను చేకూర్చి ఖ్యాతి ఘడించిన వైశ్యరత్న శంకర నారాయణ శ్రేష్ఠి నీ ప్రియ పుత్రుడే కదా.

ధ్వని చేత వివిధ రకాల శబ్దాలను అనుకరిస్తూ కంటికి కనిపించనివి కూడా శబ్దంతో వాస్తవ మనిపిస్తూ దేశవిదేశాలలో భరత భూమి గొప్పతనాన్ని చాటి చెప్పిన ప్రప్రథమ ధ్వని సామ్రాట్ శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ నీ ప్రియ పుత్రుడే కదా.

ఎందరెందరికో నీవు అండగా వుంటూ వైశ్యజాతి మణిపూసలుగా విరాజిల్లింప చేస్తున్న మా అమ్మా! వాసవాంబా దేవీ! మా తల్లీ! భరతమాత బిడ్డల జేజేలు అందు కొనుమూ.

## సంఘము గుర్తించాలి

ఆర్యా! కడపకు మీ కార్యాలయానికి వచ్చినపుడు మీరు నాకు యిచ్చిన "వైశ్య వైజయంతిక", "వాసవీ" ఇత్యాతి గ్రంథములను చదివాను. సంఘోద్ధరణకు ఈ గ్రంథములు తోడ్పడును. ఇంకా కొన్ని గ్రంథాలు వెలువడాలని ఆశించుచున్నాను. మీ మహోపకారాన్ని సంఘము గుర్తించాలని ఆకాంక్ష.

నమస్సులు,
పంగీపురపు వీరబ్రహ్మ దైవజ్ఞ,
పంచాంగ కర్త,
అంగలకుదురు. 10-12-1996.

## గుడివాడలో అమరజీవి విగ్రహావిష్కరణ

కృష్ణాజిల్లా గుడివాడ పట్టణము వాసవీ చౌక్‌లో స్థాపించిన అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు కాంస్య విగ్రహాన్ని భారత వైశ్య సమాజ్ అధ్యక్షులు శ్రీ రజనీ రంజన్ సాహు గారు 15-12-1996వ తేదీన ఆవిష్కరించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ప్రెసిడెంట్, మాజీ మంత్రివర్యులు శ్రీ కొనిజేటి రోశయ్య, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ పడుచూరు వెంకటేశ్వర్లు గారలు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. ఆం. ప్ర. ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులు శ్రీ యం.వి.యన్. బ్రహ్మానందం గారి అధ్యక్షత సాగి విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గ సభ్యులు శ్రీ పర్వతనేని ఉపేంద్ర గారిచే ప్రారంభించబడిన ఈ సభకు గుడివాడ ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ దర్శి వెంకట నరసింహారావు గారు స్వాగతం పలుకగా ఇందుకొరకు ఏర్పాటైన కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపన సంఘాధ్యక్షులు శ్రీ సేగు వెంకటేశ్వర్లు గారు ముఖ్య అతిథులను సన్మానించారు. కృష్ణాజిల్లా ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు శ్రీ గుడివాడ రామచంద్రారావు, ప్రభృతులు పాల్గొని ప్రసంగించిన ఈ సభకు గుడివాడ చేంబర్ ఆఫ్ కామర్సు & ఇండస్ట్రీస్ వర్కర్స్ సెక్రటరీ శ్రీ తిరువీధుల శ్రీరాములుగారు వందన సమర్పణ చేశారు.

# సోమయాజుల వారి ఉపన్యాసాలు - 1

(గత సంచిక తరువాయి)

9. సోదరులారా! మనము త్రయీవేదాః అని చెప్పు మాటకు మూడు వేదములని యర్థముకానేరదు. మూడు విధములైన మంత్రములని (త్రయాత్మక) అర్థము వచ్చును. ప్రతిదేశమందును (గద్య, పద్య, గీత) వచన పద్య కీర్తనలను మూడు విధములు గలవు. పూర్వమున సంస్కృతమందు దీనిని ఋచః, సామాని, యజూంషి యని వాకొనిరి. తైత్తిరీయ బ్రాహ్మణం (1-2-1) చూడుము. ఋచః'' అనగా పద్యములు. "సామాని' ' అనగా గీతములు. 'యజూంషి'' అనగా గద్య. జ్ఞానము ఋక్, సామ, యజు, ర్మంత్రము లనెడి మూడు పర్వత సమములైన రూపముల (త్రింగిరిరూపం) మూలమున యితరులకు తెలియజేయ బడుచున్నది. (తైత్తిరీయ బ్రాహ్మణము 3-10-11-3) ఈ భాగము వేదము లనంతములైనవనియు గద్య పద్య గీతములనెడు మూడు భాగములు కలిగినవనియు ఇట్లు ప్రతివేదమునందును నిరూపింప వచ్చును. సాలమన్ వ్రాసిన కీర్తనలు యిందుకు తార్కాణము. ఇంద్రుడు తాను మూడు వేదములను మాత్రమే చదివితిననియు సర్వవిద్య అనబడు వేరొకవిద్యను తాను చదువలేదనియు భరద్వాజునితో జెప్పెను. ఇంద్రుడు భరద్వాజునితో "ఏహిఇమంవిద్ధి' అనగా (వచ్చి దీనిని నేర్చుకొనుము) అని చెప్పెను. స్వర్ణతుల్యమైన యీ యభిప్రాయమునుబట్టి మనము నడవవలసియున్నది. కనుక మీరు యీసర్వవిద్య నభ్యసింప వలసినదని వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను. ప్రస్తుతము దివ్యజ్ఞానసమాజము (థియసాఫికల్ సొసైటి) వారును బ్రహ్మసమాజమువారును లిబరల్ క్రిష్టయనులును ప్రయత్నించుచున్న విధమున మనమును సర్వజనహితాలయము (Universae Church) లో చేరుటకును మనముకూడా ప్రయత్నింపవలయును.

10. జ్ఞానము ప్రప్రమథమమున నార్యావర్తనమునగల మహర్షులకు విశదీకరింపబడెను. ఆర్యులలో నొక తెగ దేశమును విడచి పశ్చిమదిశవైపునకు వెడలిరని, యనుమానరహితముగ విశదీకరింపబడినది. ప్రస్తుతమింగ్లీషువారీ యార్యులసంతితివారే?- ఒక తెగ పరిష్యా దేశమునకు మరియొక తెగ హిందూ దేశమునకు వెడలెను. ఆర్యావర్తమందలి మహర్షు లుపదేశించినదియు, పరిష్యా దేశమందు జొరాష్టర్ యుపదేశించి నదియు, యూదియా దేశమందు మోషేక్రీస్తు లుపదేశించినదియు మనము గ్రహింపవలసినదే? ఈ మహాత్ము లుపదేశించినవియెల్ల వాటిపై నున్న దోషారోపణములను తీసివేసినయెడల ఒక విషయమునుగురించియే మన కుపదేశించిరనియు వారియుపదేశము లందు భేదభావములేదనియు నాయభిప్రాయమై యున్నది.

ఐరోపాదేశమందు ఒక మహాత్ముడైనా పుట్టియుండలేదు. ఆ దేశమందు సంస్కర్తలును వివేచనాధురీణులును జన్మించి యుండిరి. కాని క్రీస్తు, జొరాష్టరు, మహమ్మదు మొదలైన మతస్థాపకులను బోలినవారు జన్మించియుండలేదు. మతస్థాపకులెల్ల ఏష్యాదేశమం దుద్భవించినవారే? ఆసియా దేశమునందన్నియు ఉపమానరీతిగా నుపదేశింపబడియుండెను. మన మీ మహాత్ముల యుపదేశముల గ్రహింప వలయునన్న నుపమానోప మేయముగాక వానివిశేషార్థమును గ్రహింపవలయును. విశేషార్థమునకును ఉపమానమునకు గల తారతమ్యమును మనము బాగుగా గ్రహించి- యుండవలయును. అప్పుడే సర్వమతముల యుపదేశములను సమమని మనము గ్రహింప గలుగుదుము. మతములన్నియు యీశ్వరు డొకడున్నాడనియు, అతడే మన రక్షకుడనియు, మనుజులు మన సోదరులనియు, స్వార్థమునువీడి మానవుల సౌఖ్యమునకు మనము కష్టింప వలయుననియు చెప్పుచున్నవి.

11. జండ్ వెస్టగాని, బైబిలుగాని, ఖురానుగాని, దేవుడొక్కడేయని సూచించుననువిషయము నిర్వి వాదాంశము. హిందూ వేదము దేవుడొక్కడని చెప్పునని నమ్మకపోవచ్చును. కాని నేను అది అట్లేబోధించునని వక్కాణించెదను. ఇక ముందు నేను వేదమని యుపయోగించునపుడెల్ల పారంపర్యముగా మహర్షులచే యుపదేశింపబడిన మంత్రమను నర్థముతో నుపయోగించెదను. బ్రాహ్మణము మంత్రమని చెప్పజాలను. నాయభిప్రాయమునందిది వేదమున చేర్పబడుట తప్పు. మహాభారతమును పంచమవేదమని యెట్లుచెప్పుచుండిరో బ్రాహ్మణమును నట్లే చేర్పబడియుండెను. మహర్షు లేమిచెప్పిరో దానిని తెలిసికొనవలయునన్న మంత్రభాగమును మాత్రమే మనమాధారముగా తీసికొనవలసి యున్నది. బ్రాహ్మణ భాగమును తీసివేయుటకు కారణములు చెప్పవలయునన్న కాలా తీతమగును. అధమ మొకదినమైనను దానికుపయోగింప వలసి వచ్చును. ప్రాక్పండితవ రేణ్యులు (Oriental Scholars) ను, పురాతనహిందూపండితులును బ్రాహ్మణ మును తీసివేయవలసినదని నుడివినట్లు నేను నిరూపింపగలను. బ్రాహ్మణము మంత్రమునకు భాష్యమేగాని వేరుకాదు. మూలమును భాష్యమును గలిపి రెండును సమానమని వాదించు వీరికుతర్కము లెల్ల అసత్యములని గోచరమగుచున్నది. ఈ రెంటిని కలుపుటవల్ల మహర్షులయొక్క యుపదేశములకు అపార్థములు కలిగినవి. ఈ యభిప్రాయమునందు కొంద రేకీభవింపక పోవచ్చును. కాని యీదినమున మంత్రముయొక్క నిర్మలత్వమునుగురించియు, ఆర్య మహర్షులు స్థాపించిన మతము యొక్క నిర్మలత్వమును గురించియు నుపన్యసించెదను.

12. వేదమనగా మంత్రభాగము. (ఛందోభాగము) దేవుడొక్కడేయని నిరూపించుచున్నదని నేను తిరిగి వక్కాణించు చున్నాను.

13. ప్రస్తుత మభ్యసింపబడు సంస్కృతమునకును వేదభాషయగు

సంస్కృతమునుకు మిగుల వ్యత్యస్తముకలదు. సంస్కృతము గ్రీకు, హిబ్రూ భాషలకు సోదరభాషయని పిలువబడుచున్నది. కాని వేదభాషయగు సంస్కృతము వీటికన్నిటికి మాతృభాషయై యున్నది. అది ఛందస్సు అని పిలువబడుచున్నది. జండ్ (Zend) అనునది ఛందస్సు అను పదమునుండి యుత్పత్తి యయియున్నది. ఛందోభాషను మనము బాగుగా గ్రహింపవలసియున్నది. తాత్కాలిక సంస్కృతముననుసరించి యర్థముదీసికొనినయెడల గొప్ప పొరబాటు పడిన వార మగుదుము. ఇదివరకు పొరబడినట్లే వేదార్థము గ్రహించుటయందు యికముందును పొరబడుదుము. "అసుర" అను పదమును గైకొని విచారింతము. ఏ సంస్కృతపండితు నడిగినను రాక్షసుడని అర్థముచెప్పుదురు. మనమెల్లరము అట్లే యనుకొనుచున్నాము. చందస్సునందుగాని జడ్ నందుగాని దానియర్థమేమి? అది మిగుల యత్కృష్టమైనది. సరస్వతి, యింద్రుడు, అగ్ని, మొదలగువారందరు అసురులెట్లగుదురు. అసురపదము యొక్క యర్థము పూర్ణముగా మారి పోయినది. ప్రస్తుతము వేదములో నంత్యభాగమునందును రాక్షసుడను నర్థముతో నుపయోగింప బడినదిగాని పెక్కుభాగములందు దేవతలను నర్థముతో నుపయోగింప బడినది.

"త్వం రాజేంద్రయాచ దేవారక్షాన్నౄ
సాహ్యాసురత్య మస్మా
ఋగ్వేద1-174-1

"బృహదుగాయుషే వచో
సుర్యానదీనాం" ఋగ్వేద 7-96-1

(ఇంకావుంది)

# నర్సంపేటలో శ్రీ వాసవీ దేవ్యాలయ నిర్మాణానికి శంఖుస్థాపన

వరంగలు జిల్లా నర్సంపేట ఆర్యవైశ్య సంఘము వారు నర్సంపేటలో నిర్మించ తలపెట్టిన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయ నిర్మాణానికి 5-12-1996వ తేదీన శంఖుస్థాపన జరిగింది.

# శ్రీ అంబటి రామయ్య గారి స్వర్గారోహణ

అనంతపురం జిల్లా ధర్మవరం పట్టణ వైశ్య ప్రముఖులు, దానశీలురు, శ్రీ అంబటి రామయ్యగారు 9-12-1996న పరమ పదించిరి.

# వివాహం

సికింద్రాబాద్ వైశ్య ప్రముఖులు శ్రీ మద్దికుంట బాలరాజయ్య గుప్తగారి కుమారులు చి॥ ఉమా మహేశ్వర్ వివాహం సదరు పట్టణం శ్రీ మాశెట్టి సత్యనారాయణ గుప్త గారి కుమార్తె చి॥ శాంతితో 18-12-1996వ తేదీన సికింద్రాబాద్‌లోని మన్నూరు కాపుసంఘము వారి కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

గమనిక : ఈ శీర్షికలో ప్రచురణ కావాలనుకునే వారు రూ॥ 116/- డి.డి. లేక యం.ఓ. ద్వారా పంపుతూ అవసరమైన వివరాలు వ్రాయాలి.

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973

## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

**ఆర్.ఆర్.నాధం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# బళ్ళారిలోని ప్రాంతీయ వైశ్యవిద్యానిధి వారు విద్యార్థులకు ఈ సంవత్సరం అందించిన ఆర్థిక సహాయం

22-12-1996వ తేదీన బళ్ళారిలో జరిగిన పై వైశ్య విద్యానిధి. సర్వసభ్య సమావేశము ఈ క్రింది విధంగా వైశ్య విద్యార్థులకు ఆర్థిక సహాయాన్ని అందించాలని తీర్మానించింది

మెడిసన్, డిగ్రీ చేస్తున్న విద్యార్థులు ముగ్గురికి ఒక్కొక్కరికి ఐదువేల రూపాయలు చొప్పున, ఇంజనీరింగు డిగ్రీ చేస్తున్న విద్యార్థులు ఏడుగురికి ఒక్కొక్కరికి ఐదువేల ప్రకారం - యం.బి.ఏ., యం.యస్.సి.(అగ్రి), యం. ఫార్మా, డిప్లొమా యిన్ బిజినెస్ మేనేజ్మెంటు, మాస్టర్ ఇన్ కంప్యూటర్ అప్లియన్సెస్, డిప్లొమా ఇన్ కంప్యూటర్ సైన్సులకు సంబంధించి, ఒక్కొక్క దానికి ఒక్కరు చొప్పున యం. ఫార్మసి, యం.యస్. సి (అగ్రి), యం.బి.ఏ. చదువుచున్న విద్యార్థులకు రెండువేల రూపాయలు, మిగతా కోర్సులకు సబంధించి ఒక్కొక్కరికి పదునైదు వందల రూపాయలు చొప్పున మొత్తము యాభైవేల రూపాయలు, ఇస్తుంది. ఇవన్నీ కూడ లోను స్కాలర్షిప్పులు. అనగా సహాయం పొందిన విద్యార్థి, సంపాదన పరుడైన తర్వాత తప్పక తీర్చుకొనవలయునను ప్రాతిపదికన మంజూరైనవి.

ఇక మెరిట్ బహుమతులకు సబంధించి, ఫెకల్టీ ఆఫ్ ఇంజనీరింగు చదువుచున్న బళ్ళారి పట్టణానికి చెందిన మిస్ పతి సుమన, బి.ఇ. కామర్సుకు సంబంధించి, గుంతకల్లు పట్టణానికి చెందిన యస్. శ్రీనివాసులు శ్రేష్ఠి, మెడిసన్‌కు సంబంధించి బెంగుళూరు పట్టణానికి చెందిన డి.హెచ్.సి. సందీప్ కుమార్ యం.బి.బి.యస్. గార్లకు ఇవ్వాలని ఈ సమావేశము తీర్మానించింది. ఈ మెరిట్ బహుమతులు బంగారు పూతపూసిన వెండి పతకముల రూపములో ఒకవైపు విద్యార్థిపేరు, విద్యార్హత, సంవత్సరము మరో ప్రక్కన పై విద్యానిధి పేరును కలిగి ఉంటాయి. అగ్రికల్చర్‌కు సంబంధించి, ఈ మెరిట్ స్కాలర్షిప్పులు అందుకొనుటకు అభ్యర్థులెవరూ దరఖాస్తు చేయలేదు.

దాదాపు యాభైవేల రూపాయల వ్యయముతో పై విద్యానిధి స్వర్ణోత్సవాలను ఈ 1997లో వచ్చు ఆషాఢ మాసములో ఘనంగా నిర్వహించాలని కూడ ఈ సమావేశము నిర్ణయించింది.

ఈ విద్యానిధి వారు ప్రతియేడూ ఇస్తున్న లోను స్కాలర్షిప్పులూ, మరియు ఉపకారవేతనాల కొఱకు శ్రీ ఊరకర నారాయణ శ్రేష్ఠి శ్రీమతి ఊరకర లక్ష్మీ దేవమ్మ దంపతులు ఒక లక్ష రూపాయలు విరాళంగా ఈ నిధికి ఇచ్చారు. వీరికి ఈ సమావేశము ధన్యవాదాలు తెల్పింది.

**జీవిత సభ్యత్వ చందా**
**రు. 400/-**

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

రిజిష్టర్డు నెం. 328/94

బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.

భారతదేశము లోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవననిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,116/-లు ఇచ్చిన వారు స్థల దాతలుగా ఉంటారు.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కు కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ పై అడ్రసుకు పంపి, రసీదు పొందకోరుచున్నాము.

5 వేల రూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనమునందు ఉంచుతారు.

ఈ పవిత్ర కార్యక్రమానికి ఉదార హృదయముతో సహకరించవలసిందిగా ఉదార హృదయులైన వైశ్య మహనీయులను కోరుచున్నాము.

"ప్రజాబంధు" "దానశీల"

జూటూరు శరభయ్య — కార్యదర్శి

కా[illegible] — అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.1.1997 నుండి 20.2.1997 వరకు)

చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకం పన్ను మొత్తానికి చెక్కును వ్రాసి ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కు ద్వారా కాకుండా చలానా ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఫిబ్రవరి నెల 20వ తేదీన గానీ, అంతకు ముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 డిసెంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్ మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ జనవరి నెల 31వ తేదీ లోగా చేర్చాలి.

1996 డిసెంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ జనవరి నెల 31వ తేదీ లోగా చేర్చాలి.

# విశాఖలో అమరజీవి 44వ వర్ధంతి

విశాఖపట్టణములోని పలు ఆర్యవైశ్య సంస్థలు 15-12-1996వ తేదీన విశాఖ పట్టణములో అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు గారి 44వ వర్ధంతిని సంయుక్తంగా జరిపించారు. ఈ సందర్భంగా జరిగిన సభకు శ్రీ కంకటాల అప్పల రాజుగారు అధ్యక్షత వహించారు. శ్రీ పి.వి. రమణయ్య రాజా గారు జ్యోతి ప్రజ్వలన చేసి, శ్రీరాములు గారి చిత్రపటానికి పుష్పమాలలు వేశారు. ఆంధ్రా యూనివర్శిటీ కాలేజ్ ప్రిన్సిపాల్ శ్రీ వి. బాలమోహన్, ప్రొఫెసర్ శ్రీ పి.వి. రాజు, శ్రీ యం.కె. సీతారామయ్య ప్రభృతులు ఈ సభలో శ్రీ పొట్టి శ్రీరాముల త్యాగనిరతినీ, సేవాసక్తినీ గురించి ప్రసంగించారు. శ్రీ వై. యస్. శాస్త్రి గారు రచించిన 'బలిదానం' అను పుస్తకమును శ్రీ పి.వి. రమణయ్య రాజా గారు ఈ సభలో ఆవిష్కరించారు. శ్రీ డి.సి.హెచ్. వెంకటరావు గారి వందన సమర్పణతో ముగిసిన ఈ సభలో దేశభక్తి గీతాలు, వక్తృత్వ పోటీలలో గెలుపొందిన వారికి శ్రీ వి.వి. రంగనాయకులు గుప్త గారు బహుమతి ప్రధానం చేశారు.

## దుకాణాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 26-01-1997 | ఆదివారము | రిపబ్లిక్ డే |
| 10-02-1997 | సోమవారము | రంజాన్ |
| 08-04-1997 | మంగళవారము | ఉగాది |
| 01-05-1997 | గురువారము | మే డే |
| 15-08-1997 | శుక్రవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1997 | గురువారము | గాంధీ జయంతి |
| 11-10-1997 | శనివారము | విజయదశమి |
| 01-11-1997 | శనివారము | ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ దినము |
| 25-12-1997 | గురువారము | క్రిస్టమస్ |

Progs. No. డి2/ఎ.పి.యస్.ఎఫ్. అండ్ ఓ.హెచ్./96
తేది : 9-12-1996, డిప్యూటీ కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.

## కర్మాగారాలు - సంస్థలలోని ఉద్యోగుల సెలవు దినాలు

| | | |
|---|---|---|
| 26-01-1997 | ఆదివారము | రిపబ్లిక్ డే |
| 10-02-1997 | సోమవారము | రంజాన్ |
| 08-04-1997 | మంగళవారము | ఉగాది |
| 01-05-1997 | గురువారము | మే డే |
| 15-08-1997 | శుక్రవారము | భారత స్వాతంత్ర్య దినము |
| 02-10-1997 | గురువారము | గాంధీ జయంతి |
| 11-10-1997 | శనివారము | విజయదశమి |
| 25-12-1997 | గురువారము | క్రిస్టమస్ |

Progs. No. డి2/ఎ.పి.యస్.ఎఫ్. అండ్ ఓ.హెచ్./96
తేది : 9-12-1996, డిప్యూటీ కమీషనర్ ఆఫ్ లేబర్, కర్నూలు.

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.